శ్రీ రస్తు.

హరిభక్తాగ్రగణ్యుండగు.

# పురందరదాసు చరిత్రము.

నెల్లూరు నివాసుడగు,

వరగంటి వెంకట రమణయ్యగారిచే

రచియింపఁబడి

పండితులవలన బరిష్కరింపఁబడి

సత్పురుషుల సహాయమువలన

శ్రీరంగనాయకి విలాస ముద్రాక్షరశాలయందు

నెల్లూరు శ్రీనివాసాచార్యులవలన

అచ్చుగూర్పించి

ప్రకటింపబడియె

---

నెల్లూరు.

1904.



శ్రీరామ.

శుభమస్తు.

శ్రీరాఘవేంద్రుచరణాం । భోరుహములు మదిదలంచి పురహరనుతుడౌ । శ్రీరుక్మిణీమనోహరు । చారుకథాతతివచింతు సదమలభక్తిన్ ॥

యమునాకళ్యాణి - ఆదితాళం.

రఘుపతేమాంపాలయ । దయానిధే । రఘుపతేమాంపాలయ । అఘవిదారణ కనకాంబరశోభిత ॥ రఘుప ॥ సుజనావన సజ్జననుతచరణ । నిజజనహృదయాబ్జనీరజమిత్ర ॥ ర ॥ పవనతనయ హృత్ఖవననివాస । సవనావనసర్వ శాత్రవశోష ॥ ర ॥ నిగమశైల విహారనిఖిలలోకాధార । అగణితవిభవ శ్రీరామనృపాల ॥ రఘు ॥

వ॥ ఇట్లుజగద్రక్షకుండగు నారాయణమూర్తింగొని యాది శ్రీమధ్వసిద్ధాంత నిర్మాణచాతురీ ధురీణులగు శ్రీమదానంద తీర్థ భగవత్పాదాచార్యులకు మొక్కి పరమభాగవతులకు వందనంబు లాచరించి యేనొనర్పంబూనిన భగవచ్చారిత్రంబునకు గథా క్రమంబెట్లనిన.

చం॥ హరిచరణారవింద యుగళార్చన సన్నుతిభక్తియోగ ముల్ । నిరతముగల్గువారు భవనీరజగర్భుల కందరానిభా । పర పదమందుజేరుదురు సూరిజనస్తవనీయయట్టిస । త్పురుషులపూ ర్వజన్మఫలముల్ గణుతింపద రంబెయేరికిన్॥

వ॥ ఎల్లపుడు శ్రీనారాయణమూర్తి పాదారవిందములుబూ జింపుచు స్తోత్రముసేయుచు భక్తిసేయువారు బ్రహ్మరుద్రులకుం గూడనందనటువంటి పదవినిజెందుచున్నారు. అట్టి సత్పురుషుల యొక్క పూర్వజన్మ సుకృతమును లెక్కపెట్టుటకె వరివశమని విదురుడు మైత్రేయమహాముని తో జెప్పియున్నాడు.

శ్లో॥ సకృన్మనః కృష్ణపదారవిందయోర్నివేశితం తద్గుణరాగి యైరిహ । న తేయమం పాశ భృతశ్చతద్భటాన్ స్వప్నే పిపశ్యంతిహిచీర్ణనిష్కృతాః॥

వ॥ అనగా నెవ్వరైతే కృష్ణమూర్తియందు నిష్టము గిలవారై సకృత్తుగానైనా కృష్ణమూర్తి పాదారవిందములయందు మనస్సు చేర్చుచున్నారో అటువంటివారి పాపములునశించిపోయి యము నిగాని పాశములను ధరించిన యమదూతలనుగాని స్వప్నమం దైనా చూడరనివిష్ణుదూతలు యమధర్మరాజుతో జెప్పియున్నారు.

శ్లో॥ వాసుదేవపరా వేదా వాసుదేవపరామఖాః । వాసుదేవ
పరా యోగా వాసుదేవపరాక్రియాః ॥

క॥ అనగా వాసుదేవమూర్తిని భజించుటకంటె మించిన వేదముగాని యజ్ఞముగాని తపస్సుగాని ధర్మముగాని సద్గతిగాని యేదియులేదు. సమస్తఫలములు వాసుదేవమూర్తిని భజించుట వలన గలుగుచున్నవని భాగవతమందు చెప్పబడియున్నది.

శ్లో॥ సంసారార్ణవమగ్నానాం నరాణాం పాపకర్మణాం ।
నోద్ధర్తాన్యో జగన్నాథంత్యక్త్వా నారాయణం ప్రభుం॥

వ॥ అనగా సంసార సముద్రమునందు బడితల్లడించు పాపకర్ములగు మనుష్యులు జగన్నాథుండగు నారాయణమూర్తిని వదలిపెట్టినయెడల నట్టివారిని రక్షించుటకు నన్యులెవ్వరు సమర్థులు గారని కృష్ణామృతమహార్ణవమందు చెప్పబడియున్నది. కాబట్టి ఓ జనులార నానావిధదుఃఖములతో గూడుకొనియుండు సంసారమునునమ్మి హరిభజనంబుమాని యమకింకరులచే బాధనొందితపించుటకంటె శ్రీమన్నారాయణ కథా శ్రవణంబున కాలంబు గడిపి నిత్యసుఖంబనుభవించుట మేలుగావున.

కం॥ తెలిపెదహరికథమధురస । మొలకగ వినదగునుకామముఖ్యములణగుఁ; గలుషములు వెడలిపోవును । సలలితముగ విష్ణుకరుణచాలగ గల్గుఁ॥

ఓ జనులార నేనిప్పుడు హరిభక్తాగ్రగణ్యుండగు పురందరదాసు చరిత్రంబు మీకుంచెప్పుచున్నాడ. శ్రద్ధాభక్తులతోడవినుండు హరిభక్తుల చరిత్రంబులు వినుటవలన పాపంబులు నశించుచున్నవి.

డోరా - ముఖారిరాగం.

శ్రీవాసుదేవాయనుడీ । శ్రీవల్లభుసత్కృపగనుడీ ॥ శ్రీ ॥
ఘనుడు పురందరుడను నొకవిప్రుడుగలడతి కఠినాత్ముండు । ధన
వంతుండై పండరిపురమున। దగప్రఖ్యాతిగనుండు ॥ అతనిభార్య
మహాలక్ష్మీబాయియాకూతురు రుక్మిణియనగా । నతులిత సద్గుణ
సౌశీల్యాదుల క్షితివెలసిరికడుబాగా॥ లక్షాంతరములు ధనము
గడించెను లక్ష్మీశు నికృపవలన । భిక్షంబొసగడు పరులకెవ్వరికి
పెనులోభిత్వమువలన॥

వ॥ పూర్వకాలంబున భూమియందు గల పట్టణంబులలో
మిక్కిలి పుణ్యక్షేత్రంబగు పండరీపురంబను పట్టణంబుగల దందు
పురందరుండను నొకమధ్వబ్రాహ్మణుండు నానావిధవస్తు వ్యాపా
రంబులు సేయుచు లెక్కలేని ధనంబుగూర్చి మిగులకఠినచిత్తుం
డును పరమలోభుండునై తాను భుజింపక పరులకెవ్వరికి భిక్షం
బైనని డకభగవద్భక్తిలేక మహానికృష్టుండని చెప్పబడుచుండె.
అతనిభార్య లక్ష్మీబాయియను నామెసమస్త సద్గుణంబులుగల్గి
మహాపతివ్రతలగు సౌదాసుని భార్యమదయంతియు చ్యవనుని
పత్నిసుకన్యయు సత్యవంతునిదేవియగు సావిత్రినింబో లిద్రౌప
దీదేవి సత్యభామకుజెప్పిన పాతివ్రత్యధర్మంబుచొప్పున నడుచు
కొనుచుండె, నెట్లనిన॥

జంఝూటిరాగం - ఆదితాళం.

మంగళకరమగు పనులొనరించునుమానిని యెల్లపుడు । సంగ
తిగా శ్రీహరిచరిత్రములు సద్భక్తిని వినునెల్లపుడు ॥ మం॥ పతి

దైవంబని భావింపుచు దుష్పథములుదలపకను । పతితులజేరక భాషింపక శ్రీపతిసతిపూజలొనర్చుచును ॥ మం॥ మంగళగౌరి వ్రతములు సలుపుచు మధుసూదనుదినము । పొంగుచును పవాసంబులొనర్చుచు పురుషోత్తముగీర్తింపుచును ॥ మం ॥ వేదాద్రీశుని చింతింపుచు సద్వ్రమలవృత్తితోను । శ్రీదయితుని పదసేవయొనర్చుచు చిత్తముహరిపై జేర్చుచును॥

వ॥ మరియు లక్ష్మీబాయి గృహంబునందు మంగళ కరంబగు పనులుసేయుచు భగవత్కథలువినుచు పుణ్యవ్రతంబులు సలుపుచు విష్ణుదినంబులందు భగవత్పాద తీర్థంబుదప్పమరేమిబుచ్చుకొనక యుపవాసంబులుండుచు భర్తకంటె నన్యదైవంబులేదని పరిచర్యలు సేయుచు లక్ష్మీదేవి నారాధింపుచు నిర్నిమిత్తంబుగ పరులయెడ దోషారోపణంబుజేసి కటికినిందలాడిగట్టి రచ్చలకెక్కదుష్టవర్తనంబువలన నాయుర్వ్యయంబుజేసకొను పాపాంగనల స్నేహంబు కలనైనందలంపక సత్సాంగత్యంబుసేయుచు దయారసహృదయయై భగవద్భక్తయై సత్యధర్మగుణోపేతయై ప్రఖ్యాతిజెందియుండె. భర్తయగుపురందరుండ త్యంతనికృష్టుండై భిక్షుంబడుగవచ్చిన పేదసాధులదూషింపుచు తరమివెళ్లగొట్టుచు వారలతో బలుకవిధంబెట్లనిన॥

పంతువరాళి - చాపుతాళం.

ఎవరబ్బసొమ్మనితే తెమ్మనెదవుయిలుచుట్టు తారాడుచు । భువిలోనసకలబాధలు జెందకగాని పుట్టదెన్నటికైనను । నొకకాసైన ॥ఎ॥ ఇంటింటికేగివేధించి జీవింప నీకెంతమనసాయెనుర । ఇంటి

వారి బాధ లేమియెరుంగుదువు । యిటువంటిబ్రతుకేలర । నిభాగ్యుడ ॥ఎ॥ వరవేంకటశైలనివాసుని కరుణను పరగకష్టముజేసుకో । దొరికినదానిలో నాలుబిడ్డలగూడి । వరమతిజీవింపర । కరువాయర ॥ ఎ ॥

వ॥ ఇవ్విధంబున భిక్షుకుల వెళ్లదరుముచు నాపురందరుండు॥

సీ॥ అతిలోభమున నతడర్థకాంక్షనుజెంది పవలురేయును పాటుబడుచునుండు । భోజనంబునకెంత పొద్దుబోయినిగాని వడ్డీలు బెంచుట వదలకుండు । కఠినత్వమేగాని కరుణారసంబున హృదయంబు మెరయ దొక్కరించుకైన । యాచకతతిగన్న యమదూతలని మదిదలపోసి పొమ్మనితరుముచుండు । ఘనతద్దైరైశ్వర్య విభవంబుగలిగి లేని । కరణబ్రతికెను తనపూర్వకర్మవలన । నతుల పాపిష్టుడని ప్రజలందరనగ । మధ్వసిద్ధాంతమేమియు మదినినిడక॥

వ॥ పురందరుండుమిగుల కఠినచిత్తుండును దయాదాక్షిణ్యంబులు లేనివాడును నైధనంబుకొరకు కష్టపడుచు మికుటంబగు వడ్డీలుబెంచి జనుల సంకటపరచుచు భిక్షుకులుగనుపడిన యమదూతలనిదలంచి తరమివెళ్లగొట్టుచు విశేషసంపదగలిగియు దరిద్రునిపగిది వర్తింపుచు మధ్వసిద్ధాంతంబెట్టిదో తెలియక జీవింపుచుండె మరియును.

డొరా.

అంగడికేగెడు వేళలాతనయిల్లాలిని నింటిలోనునచీ । మంగళకరమని బీగముకైచుకమరి జను ద్రవ్యముదలచీ॥

ప్రతిదినంబు బియ్యము మొదలగునవి యతివేడుగొల్చి యొసంగు। హితవుగనొసగిన దానిలొమిగిలిన నతికోపమునగలంగు॥ కాసువీసములనడుగక యుండిన కరుణతోడ మార్జ్జమున్ । ఈసునుజెందను కాసడిగిన కడువేసటబడుచును జూచుల్॥ ఇవ్విధిగడిచెను నతనికిముప్పదియేండ్లు జగతిలోన । నవ్వసుధామరు బ్రోవ లంచెను హరితన హృదయాబ్జమున॥

వ॥ ఇట్లు పురందరుండు కాలంబుగడుపు నెడ నొకపర్వకాలంబున పురందరుండు భీమానదికి స్నానంబునకేగి జనులెవ్వరు లేని చోటువెతకిచూచి యచ్చట స్నానంబునకు ప్రక్రమించెనంత నతని పూర్వపుణ్యవశంబున జగద్రక్షకుండగు నారాయణమూర్తికి నతనిపైని హేతుక జాయమాన కటాక్షంబుగలిగి యొక వృద్ధ బ్రాహ్మణ రూపంబుధరించి వచ్చి నదియొడ్డుననిలిచి పురందరుండు నలుదిక్కులుజూచి యెవ్వరులేరని నీటిలోమునిగిలేచునప్పుడు గంగాస్నానఫల సిద్ధిరస్తని యాశీర్వదించి యోయిపురందరుడా పుణ్యతీర్థముల స్నానముసేయునపుడును వ్రతములాచరించునపుడును ముఖ్యముగా దానముజేయవలసినట్లు వహ్నిపురాణమందు జెప్పబడియున్నది. గావున దక్షిణ నొసంగుమనపురందరుండతని తరమివెళ్లగొట్టె మరికొన్నిదినంబులకు భగవంతుండగు పాండురంగనాథుండొక వృద్ధబ్రాహ్మణుండై బ్రహ్మదేవుని కుమారునిగా వెంటబెట్టుకొనివచ్చి పురందరుని యంగడిలోనికిబోయి పురందరుంగాంచి యిట్లనియె.

బేగడరాగం - చాపు.

ఆశీర్వాదమునీకు భూసురవర్య। ఆశీర్వాదమునీకు। భాసుర ముగ శ్రీనివాసుడునిను గాచు ॥ఆ॥ వీడు నాతనయుడు యీడుమిగిలినాడు। వీడికినుపనయనమిక సేయవలయును ॥ఆ॥ గానవేడెద నిన్ను కనకములను వేయి పూనినాకొసగుము పురుషోత్తముడు మెచ్చ ॥ఆ॥ ఘనుడు శ్రీనిగమాద్రివన జనాభునినమ్మి। నిను గాన వచ్చితిని జముగమదినమ్ము ॥ఆ॥

వ॥ ఇట్లు బలిర్ణనపురందరుం డత్యంతకోపకలిత హృదయుం డైకన్నులెఱ్ఱ జేసియిట్లనియె॥

జంఝూటిరాగం - ఏకతాళం.

ఎవ్వరునిన్ను వదలిపెట్టిరి వ్విధియింటిలోనికి। ఎవ్వరునిన్ను జూడలేదా యెవ్వరికిని దెలియదా ॥ఎ॥ తగునెనీకు నిటులసేయ ధర్మమేన చెప్పుమా। మిగులశాస్త్రవేత్తరీతి మించిమాటలాడెదొ ॥ఎ॥ నిగమశైలపతికినీ పైనెనరుగల్గియుండునా। తగనిపనులునీమదికిధర్మమనుచు దోచెనా ॥ఎ॥

దొరా.

అనుచుపురంజరుడా విప్రునిగనివిను ముధరామరనీవు। కనకములను నుపనయనమునకు నను వెనుకొని యెటులడిగెదవు॥ కనకంబులు తేరకుబడియున్న వేషనుడాయెటు లొసగుదును। మనమునదలపకు నేనిచ్చెదనని మర్యాదగబొమ్మికను॥

వ॥ అంత కపటబ్రాహ్మణుండిట్లనియె ఓయిపురందరుఁడా ద్రవ్యంబు సకలధర్మసాధనంబునకు మూలంబైయున్న యది ధనవంతుండగువాఁడు పురుషార్థసాధనంబులగు ధర్మంబులు భగవదర్పణంబుగఁ జేసి భవవిముక్తుండుగా వచ్చునెట్లనిన॥

సీ॥ ధనవంతుఁడగు వాఁడు ధర్మంబులొనరించి యుత్తమలోకంబులొందవచ్చు। యజ్ఞాదికర్మముల్ ప్రాజ్ఞుఁడై గావించి బ్రహ్మపదంబును బడయవచ్చు। అతిథిసత్కారంబుల సదృశంబుగఁ జేసి నిర్మలపుణ్యుఁడై నెగడవచ్చు। హరిభక్త నికరంబు హరిసమంబుగ నెంచి ప్రియముగా నన్నంబు బెట్టవచ్చు। నఖిలపురుషార్థములను గానందవచ్చు। భవముఁ విదళించి హరికృపబడయవచ్చు। భువి సుస్థిరస్థుఁడని పేరు బొందవచ్చు। పరమలోభుల కెటుగల్గు పరమపదము॥

వ॥ ఓయిపురందరుఁడా ధనవంతుండైనవాఁడు సమస్తక్రతువులును పుణ్యవ్రతంబులును దానధర్మంబులును భగవత్పూజనంబును జేసి పాపంబులు నశింపజేసికొని పుణ్యలోకంబులకు బోవచ్చు నిదియునుంగాక సన్యాసికి ప్రణవజపము వానప్రస్థునకును ఉపవాసములు గృహస్థునకు దానధర్మములు బ్రహ్మచారికి గురుశుశ్రూషయు ముఖ్యమైనధర్మములని యమధర్మరాజు చెప్పియున్నాఁడు కాబట్టి లోభియగువానికి పుణ్యలోకము గలుగనేరదనిన పురందరుండిట్లనియె॥

పంతువరాళి – చాపుతాళము.

పోపోపోవయ్య। వేగమె లేచి। పోపోపోవయ్య॥ పాపిష్ఠి విప్రునిపగిదిగన్న వేదీవు। ఈప్రొద్దు నే నివ్వనీకొకదువ్వ॥ పో॥

అతిలోభినై తేన్వైతినిగాని । క్షితిలోన కాసుపుట్టుట దుర్లభము ॥ పో ॥ నీతులకేమియనేకములున్నవి । నీతీరుగను గొంటెనీవస హజుడవు ॥ పో॥ వరమునిని గమాద్రివాసునిదలచుచు । తిరుగుమె చ్చటనైన దొరుకునుకాసు ॥పో॥

వ॥ ఇట్లు పురందరుండుబలికిన కపటబ్రాహ్మణుండిట్లనియె ఓ యిపురందరుడా యేనొకకయితిహాసంబుజెప్పెదవినుము పూర్వంబున ప్రహ్లాదుండొకనాడు కావేరితీరంబునకు జనియ చ్చట నజగరవ్రతధరుండైన నొకమునింగని నీవేమిటికివ్విధంబున భూమిపై నిద్రించుచుండెదవనిన నమ్మునివరుండిట్లనియె. ఏనుక ర్మంబులాచరించుటవలన నానా యోనులందుబుట్టుచు బహుక ష్టంబున మనుష్యదేహంబునొందితి నిట్టిజన్మంబున ధనంబుసం ప్రాప్తంబైననది దుఃఖకరంబుగాని సుఖకరంబుగాదు లోభవం తులగు ధనవంతులకు నిద్రాహారంబులు లేక రాజచోరయాచక శత్రుమిత్రాదులవలని భయంబున భోగంబులు మానియుందురు అర్థవంతులకు భయంబునిత్యంబుగాన విరక్తుండనైయిట్టి పాము వర్తనంబుగైకొని యేకాంతభావంబున లక్ష్మీనాథచరణములధ్యానానంద సుఖంబను భవింపుచున్న వాడనని జెప్పెగావున నీవుద్రవ్యంబుపై నాశవదలిపెట్టుట శ్రేష్ఠంబు.

తోడిరాగం - ఆదితాళం.

మమతవిడువలేవా । నీద్రవ్యముపై । మమతవిడువలేవా। కమలనాభుని పాదకంజములనునమ్మి ॥మ॥ ఎక్కడిసంసార మె వ్వారికెవ్వారు । అక్కజముగ శ్రీహరినిదలంపుచు ॥మ॥ కాసునీ

వెంటరాను కదలిపోయ్యేనాడు । భాసురముగ శ్రీనివాసుని దల
చుచు ॥మ॥ వరదశ్రీనిగమాద్రి వాసహరేయని । పరిపరివిధముల
బ్రస్తుతిసేయుచు ॥మ॥

శ్లో॥ కింథనేన కరిష్యంతిదేహినో భంగురాశయాః।
యదర్థం ధన మిచ్ఛంతి తచ్ఛరీరమశాశ్వతం॥

వ॥ నిలుకడలేని దేహముగల మనుష్యులు విశేషద్రవ్యమును
సంపాదించుటచేత నేమి చేయుచున్నారు. దేనినిమిత్తమైతే ధన
మును గోరుచున్నారో అట్టి దేహము స్థిరమైనదికాదని వ్యాసు
లవారు చెప్పియున్నారు.

సురుట - చాపుతాళం.

ఈదేహమెటుబోవునో । కట్టకడనీ ; నీదేహమెటుబోవు
నో । ఖేదమోదంబులదేలుచు సంసారమీదజాలక కడువేదనలను
బడి ॥ఈ॥ హరిపాదసరసిజమాత్మదలంపక । మరితవర్తనలను
మరిగి తిరిగిచెడి ॥ఈ॥ ధనతృష్ణలో జిక్కి-దినగణనము లేక వన
టజెందుచు దుఃఖవనధిలోబడిపడి ॥ఈ॥ ధరణి శ్రీవెంకటరమణ
దా సావనువరచరిత్రములు కీర్తింపకదలపక ॥ఈ॥

వ॥ ఓయిపురందరుడా భగవంతుడు బ్రాహ్మణపూజవలన
సంతుష్టినొందినట్లు మరిదేనివలనను దృప్తిజెందడు మథురాపు
రంబును నారాయణాశ్రమంబును హరిప్రతిమార్చన ప్రదేశంబు
లును హరిసేవాతత్పరులగు పరమభాగవతులు నివసించెడు
పుణ్యస్థలంబులును సేవించి అట్టి క్షేత్రంబులందు స్వల్పధర్మం

బు చేసినను నది వేయింతలు ఫలంబొసంగుచున్నది నీవు పాండు రంగ క్షేత్రంబున నివసించియున్నవాడవు నేనడిగిన ద్రవ్యంబొసంగి విశేషఫలంబును భవింపుము॥

అనినపురందరుఁడా విప్రునిగని మనమున కోపముగదురఁగ। వినుముధరామర నీశాస్త్రంబులు వినజాలను నేనింకఁగ॥ వేయికనకములనే నెటుదెత్తును విప్రోత్తమ దుర్ఘటము। వేయువిధంబుల వేడెదబొమ్మిక వెసనను బాధింపకుము॥

వ॥ అంతకపట బ్రాహ్మణుండిట్లనియె ఓయిపురందరుఁడా కృతయుగమునందు తపస్సును త్రేతాయుగమునందు జ్ఞానమును ద్వాపారయుగమునందు యజ్ఞములు మొదలగు క్రతువులును కలియుగమునందు దానములును ముఖ్యముగాఁ జేయవలసినదని మనువు చెప్పియున్నాఁడనిన పురందరుండిట్లనియె॥

కాంబోది - రూపకతాళం.

ఇంతహఠము సేయనేల యేలలేచిపోవయా। పంతమేలనయ్యనీకు పరీఖతి సేతుభూసురా ॥ఇ॥ నాదుబాధలేమి దెలుసువాదులాడబోకయా। కాదులేదనకనిచ్చు ఘనుడనేనుగానయా ॥ఇ॥ కనకములను దెమ్మనేవు కనకమచుచు దెలియదా। ఘనుడునిగమశైలవాసు కరుణజెందుపోవయా ॥ఇ॥

వ॥ అంతకపట బ్రాహ్మణుండిట్లనియె॥

శ్లో॥ పాపకర్మసమాయుక్తం పతంతే నరకే౽నరం। త్రాయతే దానమేకంతు పాత్రభూతేప్వ జేకృతః॥

వ॥ పాపకర్మలుజేసి నరకమునందుబడుచుండు మనుష్యులను మంచిసత్పాత్రుడగు బ్రాహ్మణునికిచ్చి నదానమువకటే రక్షించుచున్నదని మత్స్యపురాణమునందు చెప్పబడియున్నది.

దోరా.

దేహమనిత్యము ధర్మముపడచిన దిక్కువేరెగన్నడమ।
మోహజాలములడగిలి శ్రియఃపతి ముచ్చటవిడువగదగదు॥

శ్లో॥ అర్థానామార్జనేదుఃఖం। ఆర్జితానాంచరక్షణే। నాశే దుఃఖం వ్రయేదుఃఖం కిమర్థందుఃఖభాజనం॥

వ॥ ఓయిపురందరుడాద్రవ్యము సంపాదించునపుడును రక్షణసేయునపుడును నాశనమైనపుడును వ్రయముజేయునపుడును అన్నిటియందు దుఃఖముగలుగుచున్నది. ఇట్టి దుఃఖకరమైన ధనమెందుకని వ్యాసులవారు చెప్పియున్నారని కపటబ్రాహ్మణుండు బలికినపురందరుండిట్లనియె॥

నేనొల్లను నీఫలపుష్పాక్షతలివిగో౽గైకొనిపొమ్ము। ఏనెటు దెత్తునుకోరిన ద్రవ్యంబి వ్వజాలననుకొమ్ము॥

వ॥ అంతంగపట బ్రాహ్మణుండిట్లనియె॥

బేహాస్ రాగం - చాపుతాళం

ఇటులబలుకుటమేలా భూమండలమున । కుటిలమానస నీకు కోపముదగున ॥ఇ॥ ధర్మములేనట్టి ధనమేలజగతీ । ధర్మమెహరియించు కల్మషవితతీ ॥ఇ॥ జన్మసాఫల్యము చేసుకోవయ్యా । నిర్మలమతివై శ్రీహరినిగనవయ్యా ॥ఇ॥ ధరనుశ్రీనిగమాద్రి నరసింహమూర్తీ । కరుణగనుము వేగగలుగు సత్కీర్తీ ॥ఇ॥

వ॥ ఓయిపురందరుఁడా జనకరాజుపట్నమందు పింగళయను వేశ్యప్రతిదినంబలంకరించుకొని తనగృహద్వారంబున నిలిచి తనకుధనమిచ్చు వాడుగామొదటనెవడు లభించునో యట్టివాడే తనకు పురుషుండని భావింపుచు నవ్వలనెవ్వడెంత ధనంబిచ్చెదనన్నను విసర్జింపుచుండె నొకనాడు పింగళయలంకరించుకొని గృహద్వారంబునని శీథరాత్రివరకు కాచియుండినను పురుషుండెవ్వడు లభించనందున మిక్కిలి వ్యసనగ్రస్తయై ద్రవ్యాశవలన గదా నేనింతకాలము నిద్రలేకతపించితిని. నాహృదయగతుండగు లక్ష్మీనాథుడె భర్తయనియెంచి రమాదేవివలె భజించితినే నిద్రవ్యంబును సుఖమునునిత్యముగా లభించుననియు మూత్రపురీషకలితదేహులగు తుచ్ఛపురుషులొసంగు ద్రవ్యంబు మిగులనసహ్యంబనియు.

శ్లో॥ ఆశాహిపరమందుఃఖంనైరాశ్యంపరమంసుఖం। యదా
సంఛిద్య కాంతాశాంసుఖంసుష్వాపపింగళా॥

ఆశమిగుల దుఃఖకరమనియు నిరాశపరమ సుఖమనియు నెంచి పింగళయను వేశ్యతనకు పురుషునియందుగల యాశనువ

దలిపెట్టి శయ్యయందుఁ జేరి భగవంతుండగు శ్రీనారాయణచరణ కమలధ్యానంబు జేయుచు సుఖముగా నిద్రించెనని భాగవతమందు చెప్పబడియున్నది. గావున నీవు ద్రవ్యాశవదలు కొమ్మనిన పురందరుండిట్లనియె॥

డా రా.

అప్పులు గైకొని కొందరు వెళ్లిరియా పైకము రాలేదు తప్ప కసిచ్చెదమనుచును కొందరుధరలోగనుపడ లేదు॥ భూముల పైనే నిచ్చిన ద్రవ్యముబొత్తుగమునిగేపోయే। భూములుజూచి తెకొర మాలినవవిబుద్ధిమోసపోయే॥ వడ్డీయాశను మొదలేబోయెను వసు ధామరయేమందు వడ్డితనంబునజేసిన దానికి మాటలేలని కముందు॥

వ॥ అంతకపట బ్రాహ్మణుండిట్లనియె॥

శ్లో॥ ఆయాసశతలబ్ధస్య ప్రాణేభ్యోపిగరీయసః। గతిరేకా హివిత్తస్య దానమన్యద్విపత్తయః॥

వ॥ ఓయిపురందరుడా ప్రాణముఁవిసుకుజెందునట్లు నూరుక ష్టములైననుబడి సంపాదించునట్టి ద్రవ్యమునకు దానముచేయుట తప్పవేరేగతిలేదు అట్లుదానము చేయనిద్రవ్యమునకునే దోయొక విపత్తు సంభవించునని భారతమునందు జెప్పబడియున్నది. లోక మందు జన్మమెత్తినవారికి వ్యసనంబులుగలుగుట సహజంబె టనిన॥

బిలాహరి రాగం - చాపు తాళం.

ఏదో యొక చింత । యీ సంసార మెంత జేసినకొంత । ఆద రణమున శ్రీహరి కలంపనివారి ॥ ఏ॥ తనసతిశుద్ధజాడ్య గ్రస్తయనుచు । తన మేలుగోరు బాంధవులు లేరనుచు । తనధనమిక నెవరి పాలౌనోయనుచు । ధనముండి సంతతిగలుగ లేదనుచు ॥ఏ॥ అప్పులొసంగితి ధన మెల్లననుచు । నదిసారలవచ్చు నొరాదోయనుచు ముప్పునగలిగెను తిప్పలటనుచు । తప్పదుకగ్రహఫలంబె వరికనుచు॥ ఏ॥ తనవ్యాపారంబున దండగలనుచు । తనయల్లునికి మంచిగుణము లేదనుచు । తనపుత్రునకు విద్యతగనంటదనుచు । తనకన్నిది కుక్కలు నొనగూడెననుచు ॥ఏ॥ సతితన కెప్పుడు ప్రతికూలయనుచు । సుతుడన్యభామల జతగూడెననుచు । బ్రతుకుజీవనము గన్పడదాయెననుచు । పాపిష్ఠిదైవము భాగ్యమియడనుచు ॥ఏ॥ ముప్పునగల్గెను నొకకొడుకనుచు । ముదిమిచెపోగముగది సెతనకనుచు । అప్పులకై కొంపయుల్లడమనుచు । హరినిగమాద్రీ శుకరుణ లేదనుచు ॥ఏ॥

వ॥ ఇట్లుకపట బ్రాహ్మణుండు బలికినపురందరుండిట్లనియె॥

ధన్యాశిరాగం - ఏకతాళం.

ఇంతటనైననుగదలి పోవయీయిల్లు విడనినీవు । యెంత నీవు మొరబెట్టినగాని సుంతైనను నేవిననీపల్కులు ॥ఇ॥ అంగడి మూసెడలేలెమ్మికనీ సంగతువికచాలు । రంగగుశాస్త్రప్రసంగము లేటికినింగిత మెరుగనివిప్రోత్తమునకు ॥ఇ॥ లేవని చెప్పితె పోరాదాడు ర్వాదము లేమిటికీ । శ్రీదయితుండగు నిగమాచలపతి సేవయొనర్పుము చేకురు ద్రవ్యము ॥ఇం॥

వ॥ అంతకపట బ్రాహ్మణుండిట్లనియె ఓయిపురందరుడా జన్మమెత్తిన పిదపభగవంతునియందు భక్తిజ్ఞానములుగలిగి దానవ్రతంబులుసేయుచు జీవించుటయుత్తమము అట్లుగాదేని అడవియందు చక్కగాదిగిరించి వృక్షములును గ్రామములయందు నీరుమేతయుగలిగి పశువులును. అయోగ్యవృత్తిచేనిల్లిల్లుదిరుగుచు శునకసూకరంబులును విశేషభారములుమోయుచు నొంటెలుఖరములునుండునట్లు పుండరీకాక్షుండగు శ్రీనారాయణమూర్తి నిస్మరింపని పురుషపశువు తనప్రాణములను భరించుకొనుతలంపున నడవియందుగాని గృహమందుగాని నెచ్చటయుండినను ప్రయోజనములేదు.

శంకరాభరణరాగం - ఏకతాళం.

ఉండేమియుండకేమి । దండిగవిష్ణు నాత్మదలచిపూజింపనివా॥ డుండేమి॥ కరుణాసముద్రుడైన । శ్రీహరిసేవ । మరచిధారుణిలోన । పరభామలనుగూడి ధరసంచరించుదుష్టు ॥ డుండేమి ॥ శౌరికథలువినక । దాసవర్గము।జేరీసద్భక్తిబొందక । ఘోరపాతకములుగోరిచేసెడిఖలు ॥ డుండేమి॥ వరరంగధాముడగుచు । శేషధీరుని । పరిపాలనముసేయుచు । గరిమశోభిల్లు వేల్పునెరుగకుండెడిమూఢు ॥ డుండేమి ॥

శ్లో॥ నివృత్తతర్షై రుపగీయమానాద్భ వౌషధాచ్ఛ్రోత్ర
మనోభిరామాత్ । కఉత్తమశ్లోక గుణానువాదాత్పు
మాన్ విరజ్యేతవినా పశుఘ్నః॥

మహాత్ములచేత గానముచేయబడినట్టిన్ని శ్రవణమునకు మనస్సునకు మిక్కిలి రమణీయముగానుండునట్టిన్ని పాపములను

ాధులకు గొప్పఅవుషధముగా నుండనట్టిన్ని భగవంతుడగు శ్రీకృష్ణమూర్తి కథలనువినుటయందు పశువధజేయువాడు తప్ప యెవడు ప్రీతుడు గాకయుండును అందరును ప్రీతులుగా నేయుందురని శుకులవారితో పరీక్షున్మహారాజు జెప్పియున్నారు. కాబట్టి ఓయిపురందరుడా విష్ణుమూర్తి కథలువినుచు స్మరణజేయుచు గానముసేయుచు పాదసేవజేయుచు దాస్యముజేయుచు హరిని భజించితివేని పాపంబులునశించి పుణ్యలోకంబునకే గెడవనిన పురందరుండిట్లనియె.

నవరోజురాగం - ఏకతాళం.

పొమ్మన్నపో వేమయా । యోభూసుర । పొమ్మన్నపో వేమయా । సంసారబాధలు చాలాగలవునన్ను హింసలొనర్చినచే నెట్లుబోదును ॥పొ॥ యెక్కడిప్రారబ్ధమేరీతివదలును మిక్కుటమగుధన మెక్కడదెత్తును. ॥పొ॥ వరముడుని గమాద్రివాసునిపై భక్తిమరువక సేయుము దొరుకును ద్రవ్యము ॥పొ॥

వ॥ అంతకపట బ్రాహ్మణుండిట్లనియె॥

శ్లో॥ అర్థంనాస్తిగృహంనాస్తినాస్తిబంధు సహోదర । యమస్యకరుణా నాస్తికర్తవ్యోధర్మసంగ్రహః॥

వ॥ సంపాదించిన ద్రవ్యముగాని గృహముగాని సోదరులు బంధువులుగాని యెవరునువెంటరారు. ఇదిగాక యమధర్మరాజునకే మైనాకరుణగలదా ఇప్పుడే ధర్మముచేయవలసినది.

శ్లో॥ అర్థాగృహేచవర్తంతెశ్మశానె మిత్రబాంధవాః। సుకృతందుష్కృతంచైవ వగచ్ఛంతమనుగచ్ఛతి॥

వ॥ సంపాదించిపెట్టిన ద్రవ్యమింటి యందేయుంటున్నది. స్నేహితులు బంధువులు మొదలగువారు శ్మశానమువరకే వచ్చుచున్నారు. నీవుజేసికొన్న సుకృతముగాని దుష్కృతముగాని నీవులోకమువదలి పొయ్యేటప్పుడు నీవెంటవచ్చుచున్నది. కాబట్టి

ధన్యాశిరాగం - ఏకతాళం.

రెణ్ణాళ్ళనటనవినుమిది । రెణ్ణాళ్ళనటన । చెన్నుమీరుమిద్దె టిండ్లు సొమ్ములుయొన్నరాని ధనమునుగనిమఱియకు ॥ రె॥ వస్తువితానము లిస్తువుగలదని దుస్తరమోహాంబుధి బడిమిణకకు ॥ రె॥ వనితాసక్పందన సౌఖ్యంబులన నయము వెలయుట ఘనమని యెంచకు ॥ రె॥

వ॥ మరియు భాగవతమునందు విదురుండు మైత్రేయమహా మునికింజెప్పిన వాక్యంబులువినుము. ఓమునిశ్రేష్ఠుడా యెవ డైతె నొకనిమషము వృథావాదముచేతనైనా కృష్ణమూర్తి పాదారవింద ధ్యానానందసుఖము ననుభవించడో అట్టివానికి ఆయువుస్వల్పమనియు. దుష్టకర్మంబులాచర్చుటవలన సంప్రాప్తంబగు సకలదుఃఖకరంబైన జన్మమరణాది పాపంబులు పుండరీకాక్షునికథా శ్రవణంబునగాని నశించవనియు జెప్పెననిన పురందరుండు కోపంబుననిట్లనియె॥

డోరా.

కొట్టితిట్టకను నినుబంపుటయే కోరెకెదీరెననుకొమ్మ । గట్టిగమాట్లాడిన నేవిననికగర్వంబుడుగును పొమ్మ॥

అని యిటుబలుకుచు వృద్ధబ్రాహ్మణు నిహస్తముబట్టుకతో సెన్ । ధనమదగర్వోద్రేకముచేతను తనకర్మము లెడబాసెన్॥ సర్వజగత్ప్రభుదేహస్పర్శన్ చెనిర్మలపుణ్యుండాయెన్। సర్వజగన్మయు సత్కృపకీతడుచాలగ పాత్రుండాయెన్॥

వ॥ పురందరుండి వ్విధంబునవికట ప్రసంగంబులు సేయుచు లేచిపొమ్మని యాబ్రాహ్మణు నిహస్తంబుబట్టుకతో సినజగద్రక్షకుండగు భగవంతునిదేహమును పురందరుండు పట్టితాకుటచే నతనిపురాకృతకర్మంబులెల్ల నశించిభగవత్కృపకు పాత్రుండయ్యె నంతవృద్ధబ్రాహ్మణుండిట్లనియె.

శ్లో॥ వేదశాస్త్ర వినోదేనకాలోగచ్ఛతి ధీమతాం । ఇతరే
షాంతుమూర్ఖాణాం నిద్రయాకలహేనవా॥

వ॥ ఓయిపురందరుడా యోగ్యులును పెద్దలగువారికి వేదశాస్త్ర వినోదములవల్ల కాలముగడుచుచున్నది. అయోగ్యులగు మూర్ఖులకు నిద్రవల్లను తగువులవల్లను కాలముగడుచుచున్నది కాబట్టి.

నాదరామక్రియరాగం - ఏకతాళం.

ధనమదయావనగర్వోద్రేకము తన్నులు దినుటకుమూలంబు । వనజదళాక్షు పదధ్యానామృతమున నవ్యయపదవిభవంబు ॥ధ॥ హరిభక్తాగ్రేసరులకు మ్రొక్కని నరవర్గమునకు నరకంబు। హరిపదభక్తుల సాంగత్యము శ్రీహరికృపగల్గుట కారణంబు ॥ధ॥ కరివరదుని శుభచరితమువిన్నను నిరుపమముక్తికి మార్గంబు । వరరంగేశ్వర చరణాబ్జద్వయ మరుమగదలచిన భద్రంబు॥

వ॥ ఓయిపురందరుడా కోపంబెట్టివారికైన హానిగలుగజే యును కోపంబుసమస్త పాపంబులకు మూలంబుగావున కోపం బుదిగనాడి సుప్రశాంతుండవై వేదశాస్త్రంబులనమ్మి భగవంతు నారాధించుచుండు మెట్లనిన॥

సౌరాష్ట్రరాగం - ఆటతాళం.

కందర్పశతకోటి సుందరుడగు శ్రీమదిందిరాపతి సత్యము।
మందస్మితదివ్యసుందరముఖ శ్రీసుందరీమణి సత్యము ॥కం॥
పరమేష్టిప్రముఖ చిద్రూపజీవకోటులరుదారగ సత్యము।
నిరతమచ్యుత పరతంత్రులై శ్రీవిధిహరులుండుట సత్యము॥క॥
విమలవిజ్ఞాన స్వరూపముతో శ్రీవిష్ణుడుండుట సత్యము।
కమనీయకళ్యాణ గుణపూర్ణుడగుచు శ్రీకాంతుడొప్పుట
సత్యము॥

జగదుద్భవస్థితి సంహారములు శ్రీసఖుడుసల్పుట సత్యము।
భగవంతుడఖిలాంతర్యామియగుచు తాభాసిల్లుట సత్యము॥క॥
వేదవేదాంత సచ్ఛాస్త్ర సద్భావము విశ్వమందున సత్యము।
వేదవేద్యుడగు విష్ణులీలాశుభ వేషచర్యలు సత్యము ॥క॥
పదపడిశ్రీహరి పదభక్తులానందపదముజేరుట సత్యము।
మదివిష్ణుదలచని మత్తులుయమ బాధతుదినొందుట సత్యము॥
హరిమహిమార్ణవ మబ్జసంభవముఖ్యులెరుగలేనిది సత్యము।
హరిపదభక్తి ధ్యానముకంటె భాగ్యమిద్ధరలేనిది సత్యము॥క॥

శా॥ కారేరాజులు రాజ్యముల్లలుగ వేగర్వోన్నతింబొందరే। వారేరీసిరిమూటగట్టుకొని పోవంజాలిరేభూమిపై। బేరైనంగల దేశి బిప్రముఖులుం బ్రీతిన్యశఃకాములై। యీరేకోర్కులువారలు న్మరచిరే యికాలముల్ భార్గవా॥

వ॥ అనేకమంది రాజులు రాజ్యములు గల్గి మిక్కిలి గర్వముతో నుండలేదా వారు శరీరములను విడిచిపొయ్యేటప్పుడు ఆయైశ్వర్యమెమైనాకూడా మూటగట్టుకొని పొగలిగినారా వారిప్పుడెచ్చటనున్నారు. భూమిమీదవారి పేరైనాగలదా శిబిచక్రవర్తి మొదలగువారు దానధర్మములుజేసి విశేషఖ్యాతిని పొందలేదా వారినిప్పటికిని మరచి నారాయని బలిచక్రవర్తి శుక్రాచార్యులతో జెప్పియున్నాడని మరల వృద్ధబ్రాహ్మణుండు పురందరుతో నిట్లనియె॥

నీవతికఠినాత్ముండవు జగతినినిన్ను వేడిఫలమేమీ। కావున బోయెదనెచ్చటికైనను ఘనుడా నను మరువకుమీ॥ నావచనంబులు దప్పువు మేలగునన్నే విధిబలిమి నను। శ్రీవిభుకరుణకు పాత్రతగల్గును చెచ్చెర నీకికధరను॥

వ॥ ఓయి పురందరుడా నీవు మిక్కిలి కఠినహృదయుండవు నిన్నుయాచించిన ఫలంబు లేమిగావున నెచ్చటికైనం బోయెద నీవు నన్నెంతదూలనాడినను శీఘ్రకాలంబున నీకు మేలుగలుగుచున్నది. నన్నుమరువకుండుమని జెప్పికపట బ్రాహ్మణుండు లేచి పోయెనంతనిరుగు పొరుగువారలు పురందరుని కఠినత్వంబునకు మిగులచింతించి తమలో నిట్లనిరి.

ముఖారి రాగం - ఏకతాళం.

కాలగతినిజూడు। దుష్టని కాయహరణ నేడు। మేలుదీవెనలనొసగిన విప్రుని చాలగ పరిభవమొనరిచి పంపెను ॥కా॥ ధనముగల్గి సద్ధర్మమొనర్పక పెనులోభంబున పెద్దలదరిమెను ॥కా॥

కులధర్మంబులు కలలోదలపడు। కలిగెనుసిరి యీకష్టదిత్తునను ॥కా॥ సారినిగమాద్రినివాసుని చరణములాశ్రయించి కడతేరుట కొల్లను ॥కా॥

వ॥ ఇట్లు పలువురుపలువిధంబుల బలుకుచుండిరంతనా పిం త్తముండు పురందరుని భార్యయున్నగృహంబునకేగి యాపుణ్య చరితయింటివెనుక తులసీబృందావనంబుచేరువను గృహోపక రణంబులు శుభ్రపరచుచున్న నచ్చటికేగి యామెనుగాంచిన నా పతివ్రతలేచి సాష్టాంగదండప్రణామంబాచరించెనంత నావృద్ధ బ్రాహ్మణుండు ఆశీర్వదించి పుష్పఫలాక్షతలొసంగియిట్లనియె॥

శంకరాభరణం - చాపుతాళం.

మానిని నీపురమాదేవిబోలెదవు మంగళమమ్మనీకు। నిరం తరము మంగళమమ్మనీకు॥ మానితగుణశీల మనవియొకటిసేతు। ప్రాసిదానిపిని పాసగజేయుమమ్మ ॥మా॥ వీడునాతనయుడు యీ డుమిగిలినాడు వీడికినుపనయనము। వేడుకగాసేయదలచితినే నమ్మ। వేయివరహాలైతేగాని యదిగాదమ్మ ॥మా॥ ధర్మసంరక్షణ సేయుటదగు నరజన్మమెత్తినయందుకు। నిర్మలచిత్తసేమేమియొ సంగినకర్మబంధములెల్ల గ్రగుర్ణనపీడును ॥మా॥ తరుణిరోబలిచక్ర వర్తి రాజ్యముహరికి దానమిచ్చుటయెరుగవా। వరమతినిగమా ద్రివాసుడుదానికే నిరతముబలివాకిట నిల్చియుండుట ॥మా॥

వ॥ అంతపురందరుని భార్యయగులక్ష్మీబాయి యాబ్రాహ్మణుని భగవంతుడని యెరుంగక పెద్దలనియెంచి యిట్లనియె॥

శూద్రచండాలాది రూపంబులు విష్ణుమాయయని యెరింగించి రంతనా రాజేంద్రుండు వారలనేమియుంగోరక నారాయణభక్తి యుక్తుండై పరమపదంబున కుంజనియె గావున నీవుసుధర్మంబుజేసి విశేషఫలంబను భవింపుమని మరలనిట్లనియె॥

వసంతరాగం - రూపకతాళం.

నీగజముఖివినుము । నిఖిలంబున కధిపతిహరి ॥నీ॥
సురముఖరులుహరిమాయను నెరిదెలియుటకసమర్థులు॥నీ॥
లోకంబులుహరికుక్షిని ప్రాకటముగని వసించును ॥నీ॥
సత్యంబును ధర్మంబును నిత్యముగా హరిరూపము ॥నీ॥
నిగమాచలనరహరినీ కగణితమగు శుభమొసగు ॥నీ॥

వ॥ అంతపురందరుని భార్యలక్ష్మిబాయి యిట్లనియె॥

దోరా.

పుణ్యవశంబున నీమదర్శనము పొసగఘటించెను నేడు । మాన్యచరిత హరిమహిమనువింటిని మదితాపంబులుపీడు॥ ప పుణ్యంబులు నెరుగను నేనీయిల్లు జొచ్చినది మొదలు । శ్రీపతిస త్కృపయెవ్విధి నున్నదొ చెప్పజాల కష్టములు॥ నినుగనుగొన్నది మొదలుగమనమున ఘనకౌతూహలమాయెగా। ధనముగల్గికడున స్వతంత్రనై దినములు బుచ్చగనాయెగా॥

వ॥ అనిన గపటబ్రాహ్మణుండిట్లనియె॥

శ్లో॥ అహన్యహని యాచంతమహంమన్యే గురుంయథా ।
మార్జనందర్పణ స్యైవయఃకరోతిదినేదినే ॥

వ॥ ప్రతిదినము యాచించువానిని గురువుగా భావించుచు న్నాను యెంమవల్లననగా ప్రతిదినము యాచించువానికి ద్రవ్య

మిద్చుటచేత అద్దముమీఁది మైలనుకడిగివేసినట్లు పాపములునశించి పోవుచున్నవని వ్యాసులవారు చెప్పియున్నారు కాబట్టి.

ద్వి॥ రా.

సంసారంబున కష్టసుఖంబులు కలవనిచెప్పఁగనేలా। హింసలుకల్గిన ధర్మముసేయుట యింతిరోవిడచుటమేలా॥ కర్మవశంబున జన్మముకల్గును కొంతరోజగమందుననను। కర్మానుభవము దప్పదునరులకు గట్టిగఫలమొందకను॥

వ॥ ఇట్లు విప్రోత్తముండు బలికిన మృదుమధుర చాతుర్య గాంభీర్య వాక్యంబులువిని లక్ష్మీబాయి యిట్టిమహాపురుషునకేమి యొసంగినను విశేషసుకృతంబగుననియెంచి ధనంబిచ్చుటకు స్వతంత్రంబు లేక పోయెనని నింతించి పతిభయంబునకు శంకించి ధైర్యంబవలంబించి ధర్మంబుసేయుటకు నిశ్చయించి తనకపాయంబుగలుగకుండునట్లు భగవంతుంబ్రార్థించి వందనంబాచరించి॥

ధన్యాశిరాగం - ఆదితాళం.

ముక్కరనొసగెను విప్రోత్తమునకు ముక్కరవమీరగను। అక్కరగా నతడదిగొనిచనియెను చక్క నిసొమ్మనిపలపోయుచును ॥ము॥ ఏమిపుణ్యఫలమునవచ్చును నీయింతిసుకృతమేమో। తామరసాక్షునకొసగెను దానముధన్యతచెందెనుభువనత్రయముల ॥ము॥ హితమతినీ సతిగతభవమున శ్రీపతినెటునమ్మినదో। అతికుతుకంబుననిగమాచలపతికర్పణజేసెను దివ్యాభరణము ॥ము॥

వ॥ ఇట్లు లక్ష్మీబాయి తనపూర్వపుణ్య విశేషంబువలన సద్గుణోపదేశంబున నిర్మలమానసయై యేకాంతచిత్తయై తానుధరించి

యున్న దివ్యరత్నశోభితంబును ధగద్ధగాయమానంబునగు ముక్కు రను సర్వలోకరక్షకుండును జగన్నాథుండునగు కపటవిప్రో త్తము నిహస్తాబ్జంబులనునచి సాష్టాంగ వందనంబాచరించెనట్టి యెడగగనంబున దేవతలుమిగుల నాశ్చర్యంబు నొందిరి.

ద్విపద.

అంతట విప్రుడుముక్కురతోడ పురందరు నంగడికరిగెను।
వింతగమొగమున చిరునగవొదవగ వెసనిట్లని యతడనియెను॥
ఈనగగైకొని దీనిక్రయంబును నిమ్మునాకు శీఘ్రమున। దీనవైన
సతీరత్నిని జెందుముపూనితి కార్యముగాన॥

వ॥ ఇట్లు జలిక్కనకరత్న విస్ఫురితంబగు ముక్కురనొసంగిన నదిగాంచి పురందరుండత్యాశ్చర్యంబునొంది యదితనభార్యధరిం చుకొనునగయని నిశ్చయించుకొని యాబ్రాహ్మణునితో నిట్ల నియె॥

భైరవిరాగం - రూపకతాళం.

నీకేవిధిగల్గెనిదీనిక్కుముగా దెల్పెదవా । ప్రాకటముగ నీముక్కురపద్మరాగమణి కలితము ॥నీ॥ ఈభూషణమె వరికిలేదీ పూరను వెతకిచూడు । ఓభూసురనానగయిది యూరకెనీకెటుల దొరికె ॥నీ॥ నిగమాచలహరి సాక్షిగనీకొసగెదదీని క్రయము । దిగులేమియు బడబోకుముతిరిగిరమ్ము భయములేదు ॥నీ॥

వ॥ అంతగపట బ్రాహ్మణుండిట్లనియె॥

పంతువరాళి - చాపుతాళం.

నీవేనధనవంతుడ వీపురమున నీకన్నవెవరులేరా। శ్రీవి భుకరుణచెచెలగికోటి మందికావలెనన్న నెక్కడలేరు జగతిని

॥నీ॥ నీవంటిపుణ్యాత్ముడొకడు । యూచించితె । నిచ్చెను నాకదియ తడు । భావింపకు దీనిపలుమారు వేరుగ । యేవిధి నైననన్నను పుము వేగమె ॥నీ॥ మరలివచ్చెదనికపోయి । యనుమానించుటతగదోయి। అరమరలేక నొసంగుముక్రయమును । వరవేదశైలని వాసుని కరుణను ॥నీ॥

వ॥ ఇట్లు కపటబ్రాహ్మణుండు బలిక- పురందరువలన ననుజ్ఞా తుండై చనియెనటుపిమ్మట పురందరుండా ముక్కరనొకపెట్టె యందుని చిముద్రవై చిభద్రపరచి యంగడిమూసి తనగృహంబున కరిగే॥

డోరా.

అంతపురందరుడా గ్రహమున తనయింతినిబిలిచెను వేగ। వింతదనరనా నారీ రత్నము వెస వచ్చెనుపతిజేర॥ తనసతి ముక్కున ముక్కర లేమికి మనమునదిగు లొందుచును । వనితా మణితోనిట్లనిబల్కెను వసుధామరుడయ్యేడను॥

కళ్యాణిరాగం - చాపుతాళం.

రమణీనీదుముక్కరయెటు బోయెను సుమహితముగజెప్ప వే । అమలినరత్న విస్ఫురితమగుచు నెంతో । రమణీయమైన సొమ్మెవరికిచ్చినావు ॥ర॥ ఇంచుమించుగపదివేల వరహాలదియే మాయెనుగదవే । కాంచనాంగి రొని స్నేహునుడైననడిగెన । వంచ నమాని వచింపుము వేగమె ॥ర॥ ఆసొమ్ముతీరుమరియే సొమ్ములకు లేదు ఆశ్చర్యమాయెగదే । శ్రీసతీశ్వరుడగుని గమాద్రినరహరి భాసురకరుణ చేపరగగల్గినదదీ ॥ర॥

వ॥ అంతనానితాంతపతి వ్రతయగులక్ష్మీబాయి మిగులదిగు లొంది గద్గదవచనంబుల నిట్లనియె॥

చం॥ కనకవిశాలచేల సురకంటకమర్దన కోపమేలనీ । ఘనకృపజూపవేల త్రిజ్జగన్నుత సుందరగోపబాలస । జనపరిపాలమౌని జనసన్నుత సద్గుణశీలనందనం । దననినునమ్మి నానుదయదప్పక బ్రోవుము పార్థసారథీ॥

నాటకురంజిరాగం - రూపకం.

భవవిదారణ । భక్తపోషణ । కృష్ణా । సవనపాలన । మునిసముదయావన । భువి నెంతని శ్రీమనోందెదకరుణజూడవాకృష్ణా ॥భ॥ భాసురాంగధృతరథాంగ పరమపురుషశ్రీరంగా । వాసుదేవవరద శ్రీనివాసఖగతురంగా । వాసవార్చితా । మునివర్యవందితా । శ్రీసతివరనిగశైల శ్రితజనగణసన్నుత॥

ఉ॥ ఎన్నడు సౌఖ్యమబ్బునని యెన్నుచునామది దేవదేవని । న్నెన్నడుగాంతునాదురితమెవ్విధిబాయును యాదవేంద్రినా । కన్నమరాత్ములెవ్వరినిగానను నీకృపజూపిబ్రోవవే । పన్నగరాజతల్పక కృపామహితాత్మక పార్థసారథీ॥

తోడిరాగం - రూపకం.

మరచుటామేరగాదు । శ్రీయదుకులతిలక ॥మ॥ తరముగానిబాధగలిగె తాళసింపదగదుకృష్ణ । పరమపురుషనీదు పాదపద్మములను నమ్మినాను ॥మ॥ కమలనయనవాసుదేవ కనకవసన సుందరాంగ । శ్రీనునుబాపవయ్యని గమ్యశైలవాస జగదధీశ ॥మ॥

శ్లో॥ కృష్ణాయవాసుదేవాయదే వకీనందనాయచ । నందగోపకుమారాయ గోవిందాయనమోనమః॥

ఉ॥ జీవమునుండుదాక భువిజెప్పగరాని సమస్తబాధలు। న్నావలగాలుబాధలును నంతటజన్మమునొందుబాధలు। న్నేవిధి దేహికిఁగలుగు హెచ్చగుసౌఖ్యమునిన్నుదెల్పకే భూవలయంబు నందికను బుట్టగనివ్వకుననన్ను రాఘవా॥

హిందుస్తాని - రూపకం.

కరుణజూడవేమి నాకర్మమనుకొందునా - మరచుటనీకు న్యాయమా। మదినినాపై కోపమా॥ శరణుశరణురక్షకా। మరి తనిచయశోషకా। కరివరభయవారకా। కామితార్థదాయకా॥

ఢోరా.

వైకుంఠానిపలక్ష్మీ రమణావాసుదేవజగదీశా। నీ కరుణా మృతరసమునబ్రోవుము నెనరుంచుముభవనాశా॥ ఉత్తరనెటు వలెబ్రోచితివప్పుడు చిత్తమురంజిల్లగను। ఉత్తరవాలె నేనత్యా పన్నతనొందలేదతలపగను॥

ఆనందభైరవి - త్రిపుట.

రారానన్నుబ్రోవవేరా। రాజాగోపాలదేవ। మేరానీ విటుసేయ సారసదళనేత్ర। పరికికడతేరు టకనేమిసేయుదు॥ రారా॥ శరధీశయనశ్రీగోవింద। వరయోగిబృంద। వందితచర ణారవింద। నిరుపమలావణ్యానికేతనన్నుబ్రోవ। వరవేదగిరివాస వరద శ్రీ శ్రీనివాస॥ రారా॥

ఉ॥ ఎవ్వడు దేవకీసతికినిచ్చెమహాద్భుత దివ్యదర్శనం। బెవ్వ డుగోపికామణులకిచ్చె మహాభ్యున్నతముక్తిసంపదల్। ఎవ్వడు

పాండవోత్తములనేలగజేసె సమస్తలోకము । న్నవ్వసుధాస
తీరమణునాత్మదలంచెద పార్థసారథీ॥

హిందుస్తాని - ఆది.

కరుణానీకురాదా - కరిరాజవరదానాపై - కరుణనీకు
రాదా । కాంతననుచునను శ్రీకాంతుడమరువకు । కాంతలెవ్వ
రినిగావగలేదా॥ క॥ ఎన్నడునేనెరుంగనిట్టిబాధలను । కన్నడ
సేయకునిన్నెనమ్మితీ॥ క॥ భాసురనిగమశైలవాసదయానిధే ।
దాసవరదసువిలాసజగత్ప్రభో॥ క॥

ఉ॥ నాకుధనంబునీవె నినునమ్మితి నాహృదయంబులోననే ।
నాకులమొందనేల హరియచ్యుతబోధివుమటంచువేడిన । నీ్నకుక
రుంగదేమనసు నిక్కముగాదయలేనివాడవా । శ్రీకరభక్తపోషర
ఘుశేఖరనీకృపజూపురాఘవా॥

నాదనామక్రియరాగం - ఏకతాళం.

రామరారా । భయమెడబాపర । శ్యామలసుందరకోమ
లదేహ॥ రామ॥ పరమపురుష ననుమరచుటనీకిదిమేరా । శ్రీరఘు
కులవీరా । కరుణగల్గిమనవిని మదినిడరాదా । కృపలేదా । సమ
యముగాదా॥ రామా॥ చూడచూడ నతికఠినుడవైతివిదేలా । శ్రీ
రామనృపాల । వేడుకొన్నబలుకవు మునిగణలోలా। శుభశీలా ।
కోపమదేలా। రామరారా॥

ఉ॥ వందనమబ్ధిజారమణ వందనమాశ్రితభక్తవత్సలా।వందన
మప్రమేయ యదువంశసముద్భవనందనందనా । వందనమార్య

పోషసురవందితదివ్యపదారవిందగో విందముకుందకృష్ణనను వేడ్క
ను బ్రోవుముపార్థసారథి॥

అఠాణా - ఆదితాళం.

రారా । యదువీరా । పల్కవేరా । గతభవదురితముల
ను మదినిడకను కరుణజూడవేరాకృపాళో । అతులితభవజలనిధి
గడుపుము హరియార్తపోషవేదాద్రినివాస॥ రారా॥

వ॥ ఇట్లులక్ష్మీబాయి భగవంతుని బ్రార్థించునెడ పురంద
రుండిట్లనియె॥

ద్విరా.

కాలహరణ మిటుసేయుట తగదిక కాంతరొముకర
దెమ్మ । శీలమెరుంగుదు కాలముజరిపిన మేలుగల్గుదనినమ్మ॥
ఎవ్వరికొసగితి వెరిగింపుము నిన్నెవ్వరుదెమ్మనివేడెగా । ఇవ్వాకు
న్నమరియెట్లు బోయెనదియెరిగింపుము శీఘ్రమునగా॥

వ॥ అనిపురందరుండు బల్కన లక్ష్మీబాయి విశేషభయభ్రాం
తయై తనమనంబున భగవత్సాన్నిధ్యంబు గల్పించుకొని హరిం
గూర్చి యిట్లనియె॥

నీలాంబరి - త్రిపుట.

జలరుహాక్షకరుణజూపవా । పలుకవేమీకరువారావా ।
చెలగినాకిటుసంభవించెను । ఖలవిదారణరాజగోపాల । కృప
మానవేలా॥ జ॥ పతికినెనరులేకపోయెగా । కఠినుడాయెనుగా।
పతితపావననీపదాబ్జము । పరగనమ్మితిదిక్కులేదాయే । యిది

యేమిమాయ॥ జ॥ కరివరేణ్యుడు మొరలుబెట్టగా । మనసుకరిగె నుగా । కరినిగాచిననాటినీదయ కమలనాభుడయెట్లుబోయె । నిగమాద్రిరాయ॥ జ॥

చం॥ పలుకుమటంటినన్ను నెడబాయకుమంటినిరంతరంబునీ, పలుకులువింటినంటి వెతబాపుమటంటిభవద్విచారమే । గలుగగ జేయుమంటి కనకాంబరనీమహనీయవేషముఁ । బలుమరుజూపు మంటిగదపలుకవుచూడవుపార్థసారథీ॥

నాదనామక్రియ - చాపు.

ఎన్నెన్నిపాపములుజేసినేనిలపైని నీజన్మమెత్తినొకృష్ణా । పన్నగాధిపశయననీమదికెదెలుసు నదిపరికింపశక్యమాకృష్ణా॥ స తతంబునీపదద్వితయదాస్యముజేసి సన్నుతింపగనైతకృష్ణా। అతి కుత్సితాత్మనైపరనిందలొనరించి బ్రతికితిని జగతిలోకృష్ణా॥ పర మాత్మగోవిందభవ్యతరశుభవేష పాలింపుమీవేళకృష్ణా । చరణ సేవకురాలనిరసింపదగదు ననుకరుణజూడుమువేగకృష్ణా॥ వర వేదశైలశిఖరాగ్రసంస్థిత నీకువందనముసేతునిదెకృష్ణా । నరక బాధలజెందనేర నాదురితములువరమతినిబాపవేకృష్ణా॥

ఉ॥ సన్నుతనీలదేహమునిజాలవిలోల విశాలధైర్యసం । ప న్నవిదేహరాజసుతభావిత దివ్యపదారవిందయా । పన్నసు రక్షకృష్ణభవబంధవిమోచన మోహనాంగనా । విన్నపమాల కించికడువేడ్కను బ్రోవుమునన్నురాఘవా॥

వ॥ ఓ కృష్ణా నేనుమిక్కిలి పాపచిత్తనగుటచే నాకిట్టియా పద సంప్రాప్తంబయ్యె నాదురవస్థమాన్పుటకునీవుదక్క నన్ను

లెవ్వరు సమర్థులుగారు. ఏ నొనర్చినపాపకర్మంబులు మనం బుననిడక నన్ను రక్షింపుము॥

బెహాగ్ రాగం.

కామక్రోధములమానకజగతిని కాంతనైపుట్టితిఫలమేమీ। జననమరణముల బాధలనొంచుచు జగదీశుని పైచిత్తము లేక। ఘన విపదబ్ధినిబాటజాలనని కలువరించితేఫలమేమీ॥ కా॥ బ్రతికినకాల మువ్యర్థముజేసుకసతతము హరిపదచింతన లేక। పతితచరితనైకాల ముగడిపితిపాకులాడి తేఫలమేమీ॥ కా॥వరదశ్రీవైకుంఠవాస రమా రమణదురితభంజన నను కరుణింపు।అరమర లేలనునిగమాద్రీశ్వర నిరతమునీపద సేవకురాలను॥ కా॥

చం॥ కరుణజనింపదామదికి గష్టముదోచదజాలి లేదనా। మొ రవినరాదనీవిమల మోహనరూపము జూపరాదమ। స్తరకలుషా బ్ధిదాటుటకుతారక మెవ్వరునీవుగాదన। న్నరమరసేయబోకు కరుణాంబుధిమ్రొక్కెదనీకు కేశవా॥

ఆనందభైరవి - ఆదితాళం.

శరధిశయనలక్ష్మీశనను జేరరారా। భక్తవరద కృష్ణనా దువెతలుబాపపోరా॥ శ॥ సుందరతరనీలదేహమందరోద్ధర। శ్రీ యిందిరాహృదయేశమనవి సేతురారా॥ శ॥ నీరజాప్తకులవరేణ్య నీవేదిక్కురా।భవనీరధిదాటింప జగతినెవరికానురా॥ శ॥ నిగమ శైలవాసభక్తనికరపోషకా। నీయగణితసత్కృపనుజూపుమయ్య నీవికా॥ శ॥

చం॥ కరి మొరవిన్న నాటి దయగల్గుక పోయెననీకునాపయిన్। నరమరజేసి తేసభను నా(ద్రు పద్మాజనిన్ను వేడినన్ । మరువక బో(వ లేదెకృపమానితి వానిజ సేవ కాళ్లిపై॥ తరమెనుతింపనీమహిమద్దైత్యకులాంతకకృష్ణ కేశవా॥

పంతువిరాళి - రూపకం.

జన్మమెత్తితీ । వృథా । జన్మమెత్తితీ । అన్యకథలువినుచు బహుమాన్యరాలననుచు నెంచీ । పన్నగవరతల్పపాదభక్తిమాని బ్రతుకునట్టి ॥జ॥ సవనరక్షణప్రవీణజనకజాహృదీశ సర్వ।భువనవంద్యజగదధీశ బో(వుమనుచు వేడనట్టి॥ జ॥ దినదినంబుహరికథా శ్రవణసుంమమనసునిలిపి । ఘనుడు శ్రీనిగమశైలవన జనాభుభజన లేని॥ జ॥

శ్లో॥ కీదృశంతుమయాపాపం పురాజన్మాంతరేకృతం । యేనేదం ప్రాప్యతేదుఃఖంమయాఘోరంసుదారుణం॥

ఓ భగవంతుడా అత్యంతదుఃఖకరంబగు భయమునసుభవింపుచున్నానే ఇట్టిదుఃఖమునకు గారణమైన పాపమునుపూర్వజన్మమం దేమిజేసితినో తెలియదు.

వ॥ ఇట్లు భగవంతుని గొంతదడవు ప్రార్థించి తనపురాకృతకర్మంబునకుచింతించి ప్రాణంబులపైనా శత్యజించియిట్లనియె॥

కాంబోజిరాగం - ఝుంపెతాళం.

ఈజన్మమేలనిక నీదేహమేలా । శ్రీజానకీవిభుడు చెలగిబ్రోవకయున్న॥ నీ॥ కడలేనిసంసారగహనమందునజిక్కి । మొడలేని దుఃఖములకిల నేనుపాత్రమై । పడరానిబాధలనుబడుచు జీవించి

తిని । పుడమిలో నావంటిపుణ్యహీనులుగలరః॥ ఈ॥ ఏమి యెరు
గనిసతికినీధర్మగుణమేల । నెవరడ్డపడెదరిపుడేమిగతినాకు । భూ
మిలో నపకీర్తిపొందనాయెనుబ్రతుకు । స్వామిశ్రీనిగమాద్రిసా
ర్వభౌముడెగలడు॥ ఈ॥

గీ॥ బాంధవమున్ననైన బగనైనవగనైన । బ్రీతినైన ప్రాణ
భీతినైన । భక్తినైనహరికిబరతంత్రులైయుండు । జనులెమోక్ష
మునకుజనుదురధిప॥

వ॥ బంధుత్వముచేతగాని విరోధముచేతగాని యిష్టముతో
గాని ప్రాణభయమువలనగాని భక్తిచేతగాని మరియేవిధము
చేతనైనా శ్రియఃపతియందు చిత్తముగలవారే మోక్షమును జెం
దుదురని భాగవతమునందు జెప్పబడియున్నది.

శ్లో॥ మయ్యావేశ్య మనఃకృత్స్నం విముక్తాశేషవృత్తయః ।
అనుస్మరంత్యోమాంనిత్యమచిరాన్మాముపేప్యథ॥

వ॥ లోకములోనెవ్వడైన నితరచింతలను మాని తనమనస్సు
నంతయు నాయందేయుంచి నన్నే ధ్యానించుచున్నాడో అట్టిజ
నుడుమిక్కిలి శీఘ్రముగా నన్నుబొందుచున్నాడని భగవంతుడైన
కపిలుడుతల్లియైన దేవహూతికి జెప్పియున్నాడు కాబట్టి అట్టి
భగవంతుడునన్ను రక్షించుటకై ఆయనను నేను ప్రార్థించుచు
న్నాను.

దోరా.

విషపానంబునదేహము బాపెదవిబుధనికరతోష । విష
మమ్మృతంబౌ నీకృపగల్గినవిషధరనుతభవశోష॥

వ॥ ఓ జగద్రక్షకా యేనెంతవేడిన నీవుగరుణరాకయున్న యవియేను విషపానంబువలన దేహంబు విడుచుటకు నిశ్చయిం చితి నీకృపగల దేనివిషమమృతంబగునని యొకపాత్రంబునవిషం బు సిద్ధపరచి హరింగూర్చియిట్లనిస్తుతించె॥

రాగం - తాళం.

శరధిశయనలక్ష్మీశ్వర కృష్ణాసన్మునీంద్రభయహరణా । కరి వరేణ్యసంత్రాణజగత్ప్రభోకమలభవార్చితచరణా॥ ఇందిరేశస ర్వాత్మకశివవిధివందితసద్గుణశీలా । మందస్మిత ముఖసుందరత్రిజగ న్మానితమురళీలోలా॥ ౨॥ ఫణిపతితల్పకభవ్యయోగిహృత్పద్మపద్మ మిత్రా । ఇనశశినయనసుధాబ్ధినికేతన ఘనతరనిర్మలగాత్రా॥ 3॥ కంబుకంఠజగదీశ్వర లక్ష్మీకరలాలితశ్రీపాదా। అంబుజనాభ మహోన్నతసుచరితఅఖిలకల్మషోచ్ఛేదా॥ ౪॥ సకలజగజ్జనకల్మష హరశ్రీసత్యసంధగోవిందా! ప్రకటితరాసక్రీడోత్సవసద్భాసితగో పీబృందా ॥౫॥ మృగమదతిలక ఘనాఘనదేహసముజ్జ్వలదివ్యవి భూషా । ఖగరాడ్వాహన భక్తజనావనఘనము నిజనగణతోషా ॥౬॥ పాహికృష్ణదామోదర కేశవపాలయమాంరఘువీరా। పాహిపాహిసర్వోత్తమ శ్రీహరిపద్మనాభభవదూరా॥ ౭॥ సద యహృదయ శ్రీవేదాద్రీశ్వరమధుగాత్రుసవిధ్వంసా । సదమలతే జనమామియమూర్ధ్వవసాధురక్షణోల్లాసా॥ ౮॥

వ॥ ఇట్లుబలికి బృందావనంబు చెంతవిషపాత్రంబునిచి వంద నంబాచరించి విషంబుగైకొనెదనని యెంచి మరల హరిందలంచి యిట్లనియె॥

బిలాహరి - ఆదితాళం

హరికేశవా । దురితాపహా । శరనిధిసుతవరపరమపురుష నినుమరువనివారల మరువదగునె శ్రీకరరఘువరసుస్థిర మగునీ కృపనిరతముజూపుమునిగమాదీశ్వర॥ హ ॥

వ॥ ఇట్లు హరింబ్రార్థించి వినయవినమితోత్తమాంగమై బృందావనంబునకు సాష్టాంగవందనం బాచరించి లేచి విషపానంబు సేయబోవు సమయంబున బృందావనంబునందు తులసిచెట్టు కొనన వ్రేలాడుచున్నముక్కెరంగాంచి మహానందభరితాత్మయై యాముక్కెరందీసి తనహస్తాబ్జంబునముంచుకొని యిట్లనియె॥

సురటరాగం - రూపకతాళం.

ఎంతధన్యనైతీ । శ్రీరామగామ॥ చింతలెల్లబాసెజగతి దంతివరదుకృపనుగంటి సంతసంబుగలిగెమదికి సకలదురితహారణమాయె॥ నె॥ పాపచిత్తురాల । హరికృపపరగనైన్నజాల ।శ్రీప తిజగదీశ్వరుండు శ్రీనివాసమూర్తిసం । తాపహరుడునిగమశైలదైత్యహరునికరుణవలన॥ నె ॥

వ॥ అంతనాపతివ్రతాతిలకంబగు లక్ష్మీబాయి మిక్కుటంబగు సంతోషంబుజెంది యాముక్కెరంగొనిపోయి పురందరుచేతికొసగియిట్లనియె॥

జంఝూటిరాగం - ఆదితాళం

ముక్కెరదొరికెను బృందావనమున మోసముగాదిదిగో। చక్కని శ్రీరఘురాముడునాపై । మిక్కిలికరుణచే నొసగెను

చూడు ॥ము॥ ప్రాణహానినొందించెదనంటివి ప్రాణికోట్లనెల్ల । ప్రాని యెవ్వడుగాచుభువనములందున । వానినేవేడితివరదబ్రో వుమని ॥ము॥ పరులకొసంగితినంటివి నేనదిపరునకొసంగితినీ । వరముసునిగమాద్రీశుడులేడా పరిపరి విధములబలుక్రుచు నుంటి వి॥ ము ॥

వ॥ ఇట్లులక్ష్మీబాయి ముక్కరనొసంగిన పురందరుండు హైకొ నిదానియందు లిఖించి యున్న తన నామాంకితంబుజూచి తత్క్ష ణంబ తనయంగడికేగి యచ్చటతాను భద్రపరచిన ముక్కరంగా నక నాశ్చర్య భయంబులు పెనంగొన తనలోనిట్లనియె.

డోరా.

ఏమిచోద్యమిది ముక్కరగనుపడ దేమనందుహరిమాయ।
తామరసాక్షుని మహిమేమందును దాచిపెట్టినదిలేదాయ॥

బెహాగ్ రాగం - తిశ్రజాతి ఏకతాళం.

ఏమాయభూషణంబు ఆహాహాయెటులబోయె । కామించి దుష్టుడెవడొ నామందిరంబుసొచ్చె॥ ఏ ॥ ఈచిత్ర మేమనందు నింటిలోననుంచితీ । నేజెప్పజాలదాని నెవరుదొంగిలించిరో ॥ఏ॥ శ్రీవేదశైలవాస శ్రీభావితాంఘ్రియుగళ । నావల్లనేరమేమినన్ను బ్రోవజాలవా॥ ఏ ॥

వ॥ పురందరుండుతానుదాచియుంచిన ముక్కరంగానకపరితా పంబునొందుచు మరలనింటికేగి తనభార్యయొసంగిన ముక్కర తనదియౌనో కాదోయని పరిశీలించిచూచునెడ॥

దోరా.

ముకురలోపల గనెపురందరుడు ముల్లోకంబుల నెల్లన్ । అకటయిదియేమనుచును నాతండత్యాశ్చర్యమునొందెన్ ॥ ఎక్కడిముకుర ఎక్కడిలోకము లెట్లునాకుగన్పడియెన్ । నిక్కముగాహరి కృపగాకున్నను నిట్టివింతలెటుగందున్ ॥ అనివిజ్ఞాన కలితహృదయుడై యతివెతోనిట్లనిబలికెన్ । వనితరోపీడెను సంబంధంబులు వాంఛలుహరికృపవలనన్ ॥

వ॥ పురందరుండుముకురలోనమూడులోకంబులు గనుంగొని విస్మృతిజెంది కొంతదడవునకు దెలివొంది పూర్వపుణ్య వశంబున విజ్ఞానసంపన్నుండై యిహాయిది, యేమిపవిత్రంబు భగవంతుని యనుగ్రహంబువలన నేటితోకర్మబంధంబులు పీడెనని యెంచి భార్యతోమరల నిట్లనియె ॥

దోరా.

ఏమిజరిగెమనయింటనుసుదతిరోయీదినంబునందు । సీమ దిశంకింపక దెల్పుము భయమేమినీకుమదియందు ॥ ఎవరరుదెంచిరియేమనివేడిరి యెటుబోయిరివారు । ప్రవిమలమతివై దాచకతెల్పుముయువతిరో వారలతీరు॥

వ॥ ఇట్లుబలికిన లక్ష్మీబాయియిట్లనియె॥

జంఝుటిరాగం - ఏకతాళం.

ఇనసంకాశుడుకడువృద్ధుడుశ్రీయింటి రేతెంచెనోలీ । జనసుతుడనదగు నొకవిప్రుండిట చనుదెంచెనుసుతుగూడి ॥ ఇ ॥ వనరుహనయనుడు దీర్ఘబాహుడు వసుధామరుడోయెవడో । కనివిని

యెరుగను నాతనిరూపము కమలభవుడో హరుడో ॥ ఇ ॥ తులసీ మాలా యుతకంధరుడు దోషరహితుడతడు । సలలితవాక్చాతుర్యుం డాగమశైలనాథుడతడు ॥ ఇ ॥

వ॥ ఓప్రాణేశ్వరానీవుకవాటంబుబంధించుకొని యంగడికేగి న యనంతరంబున మిక్కిలి తేజోవంతుండును దీర్ఘబాహుండును గొప్పకన్నులుగలవాడును మెడయందు తులసీదళమాలధరించుకొన్న వాడునగునొక వృద్ధబ్రాహ్మణుం డింటిలోనికివచ్చి తులశీబృందావనంబుకడ నన్నుంగాంచి యాశీర్వదించి మృదుమధుర వాక్యంబుల హరి చరిత్రంబులుజెప్పి తనకుమారుని యుపనయనంబునకు వేయికనకంబులొసంగుమని యాచించె. అంత నేనమ్మహాపురుషుని సాధారణవిప్రుండనిదలపక నతని గాంభీర్య చాతుర్య మాధుర్య వచనంబులకును దివ్యమంగళ రూపంబునకును విభ్రాంతిజెంది యతండు భగవంతునిబోలిన మహాపురుషుండనియెంచి నీవలని భయంబునకు శంకింపకయేను ధరించియున్న ముక్కరయతని హస్తాబ్జంబుల నునిచివందనంబుజేసితి నంతనతండెట్లుబోయెనో యెఱుంగనని చెప్పినపురందరుండు తనమనంబున నమ్మహానుభావుండు భగవంతుండని దృఢనిశ్చయుండై తనయంగడియందుజరిగిన వృత్తాంతంబెల్ల భార్యకుజెప్పి యిట్లనియె॥

కాంబోది - రూపకం.

నారీమణివిపోత్తము నారాయణ దేవుడనుచు నేరీతినిదలచితివో యేమిపుణ్యఫలమో। శ్రీరాజితవక్షస్థలు శ్రితజనభవదూరు

హారిని భూరికృపా సాంద్రమనఘ పురుషోత్తము పొడగంటివి॥

నా॥ సరసిజభవరుద్రామరు లరసినగన్పడనియట్టి నిరుపమసచ్చ రితు నెట్లు నెరిగన్గాని మొక్కి । వరరత్నస్ఫురితంబై దనరుచున్న నీముకురవరదుడు శ్రీనిగమశైలవాసున కెటులర్పించితో ॥ నా॥

వ॥ఇట్లుబలికిన భగవంతుండు విప్రవేషంబునవచ్చియాచించిన సమయంబున గొరమాలిన ప్రసంగంబులుజేసి వెళ్ల దరిమినందు కుమిగుల విషాదంబు నొంద భగవంతుంగూర్చి పురందరుండి ట్లనియె ॥

డోరా.

హాస ర్వేశ్వరదీనజనావనవాసుదేవభవహరణా । మోస మాయెనిను దెలియగనైతినిమునివందితచరణా॥ పాపినికూరుడపర మనికృష్టుడ పన్నగేంద్రశయన । ఆపదుద్ధారకననుమన్నింపుము అఖిలలోకశరణ॥

శా॥ నీపాదంబులకేను మొక్కెదహరీనిశ్చింతు గా జేయుమీ। నాపాపంబులనంతముల్ కరుణతోనన్నింకమన్నింపుమీ। భూపా లత్వముసర్వ సంపదలునంభోజాక్షునా కేలనీ । శ్రీపాదాబ్జములే భజించునటులం జేయంగదేమాధవా॥

వ॥ ఓకృష్ణా నాపూర్వపుణ్యవిశేషంబువలన నాయందునీకుని ర్హేతుక జాయమానకటాక్షంబుగలిగి నన్నురక్షింపందలంచివి ప్రవేషంబున నాయింటికరుదెంచినన్నుయాచించు సమయంబున నైశ్వర్య మదంబువలన కన్నులుగానక భగవంతుండవని నిన్నె రుంగక వికటప్రసంగబు లొనర్చి నీకుమహాపరాధంబు గావించి

ఇట్టి దురాత్ముండనగు నాకైశ్వర్యంబేల నన్నుమన్నించి నీపాందసద్భక్తి యొసంగుము దానికంటెమించిన యైశ్వర్యం బెద్దియు లేదుగావున నాకుగలసమస్తైశ్వర్యంబు నీకుసమర్పించెదననికృతనిశ్చయుండై

## రగడ - నాదనామక్రియ.

ఏసుంమ శ్రీహరిభక్తియెంతలోనగలిగెఁ । కనకాంగదములుఘనకిరీటములు । కరకంకణములుకర్ణపత్రములు । పచ్చలవంకెలుపౌజులకమ్మలు । బంగరుకంటెలుపాంజేబులుబహు । సొగసుబులాకులుసూర్యచంద్రులును । కెంపులముద్దులుకీలుకంటెలును। కంఠసరులుదిరుగజ్జెలందియలు । మోహనమాలలుమౌక్తికసరములు । చంద్రహారములుచంద్రవంకలును । వడ్డాణ్ణంబులువజ్రపుగాజులు । గోళ్లపట్టెడలుగోధుమప్రాసలు । బంగరుమెట్టెలుపాపటబొట్టులు । శృంగారంబగుజడబంగారులు । మంగళకరమగుమొహరీమాలలు । పచ్చలపాటీల్ బన్నసరంబులు । కాసులుమాడలుకరుకులుమొహరీల్ । రామునిమాడలురజితనాణ్ణెములు। నవరత్నంబులువివిధపాత్రములు । పీతాంబరములుప్రియమగుశాల్వాలు । ఘూర్జరచీరలుకోసలచీరలు । చీనాంబరములుహేమాంబరములు । మొగ్గలచీరలునిగ్గగురవికెలు । పఠాణిచీరలుపుఠాణిరవికెలు । కాశీచీరలుకర్నాటచీరలు। రత్నకంబళములాంచిగమేలగు।నానావిధసద్వస్త్రచయంబులు । పట్టెమంచములుపరుపులుదిండ్లును । ధాన్యపురాసులుమాన్యపుభూములు । గోమహిషం

బులుగృహగణంబులును । వస్తువితానములిస్తువలెల్లను । కట్టుపు
ట్టములువప్పనన్నియును । ఘనుడుపురందరుడటిపిరస్తుడై । చూర
విడిచెనప్పురుషోత్తముప్రీతిగ ॥ప॥

వ॥ఇట్లుపురందరుండుతనయంగడియుగృహంబునుచూరవిడిచీ.

శ్లో ॥ నమఃపంకజనాభాయనమఃపంకజమాలినే। నమఃపంకజ
నేత్రాయనమస్తేపంకజాంఘ్రయే॥

వ॥ఓ భగవంతుండవగుపాండురంగనాథానాయైశ్వర్యంబును
దేహంబును నీయధీనంబుజేసితి నన్నురక్షింపుము రక్షింపుమని
బలికీ ॥

ఆ౯రా.

నాంచలెల్లెదిగనాడి పురందరుడుంచవృత్తిగైకొనియెక।
అంచితముగశ్రీహరిపదపద్మములనవరతముహృదినిలిపెక ॥

వ॥ఇట్లుకాలంబు గడుపుచు పురందరుండొక్క దినంబున॥

ధన్యాశిరాగం-

కూతురి పెండ్లియొనర్పగమదిలోగొనకొనిదాసుడుదలచీ।
ఖ్యాతిగనొకవిప్రున కొసగెను తనకన్నియ నంతటపరిణయమొన
రిచి ॥ కూ ॥ హరిసిగమాద్రినివాసునిచిత్తమునరయ నెవరితరము।
సిరివిలసిల్లెడుకాలమునందునజేయడవ్యోదనపట్టిపివాహము॥కూ॥

వ॥పురందరుండు తనకూతురి వివాహంబొనర్చిభర్తవెంటనా
కన్నియననిపి గురుసేవ సేయందలంచి వ్యాసరాయ యతీం
ద్రుని పాలికరిగి యచ్చట కొంతకాలబుండి వారి యనుగ్రహం
బువడసీ॥

సౌరాష్ట్రరాగం - చాపు.

గురుపుపదేశముపరిపూర్ణమాయె నాకింకేమింకేమి । సర సిజనాభునిపదసేవగల్గె నాకింకేమింకేమి ॥ గు ॥ దేహాభిమా నమువదలిపోయెను నాకింకేమింకేమి । మోహాదిదుర్దోషములు నశించెను నాకింకేమింకేమి ॥ గు ॥ నిరతము పెద్దలకరుణగల్గెను నాకింకేమింకేమి । స్థిరముగహరినామ చిత్తములోనిల్చె నింకే మింకేమి ॥ గు ॥ హరినిగమాద్రినివాసునికృపగల్గె నింకేమింకే మి । కరమొప్పహరినామస్మరణజింహకుగల్గె నింకేమింకేమి॥గు॥

వ॥పురందరుండు గురువువలననుజ్ఞాతుండై మరలపండరీపు రంబునకు వచ్చి భగవత్సేవవలన కాలంబుగడుపుచుండె నంత నొకనాడొక విప్రుండుపురందరు నియ్యింటికంపినవచ్చి లక్ష్మీ బాయికి వందనంబాచరించి యిట్లనియె॥

కాంబోది.

మంగళవతియమ్మ । మీరుక్షేమా। మంగళవతియమ్మా। సం గతిగామీకుజెప్పిరమ్మనిరి ॥ మం ॥ దాసుడొకడబోయె తల్లిరో దె ల్పుము యీసమయమునమీరచటికె తెంచి । భాసురముగశుభకా ర్యమునెరవుడీ । వాశిగనిగమాద్రివాసునికరుణను ॥ మం॥

వ॥ ఇట్లు బ్రాహ్మణుండు బల్కి అమ్మానీవిభుండెచ్చటికరిగెన నియడిగెడు సమయంబున లక్ష్మీబాయి చీరకట్టుకొనుచు లేవబో వునెడ సూదికాలియందు గుచ్చుకొని యాబాధకుసహింపజా లక కోపంబున అచ్యుతున కేడ్వబోయెనని చెప్పెనంత భగవం తుండగు పాండురంగనాథుండు ॥

సురట.

దాసవేషమునుబూని । పురందరదాసవేషమునుబూని।శ్రీసతివరు కీర్తనములుబాడుచు శ్రీనివాసుడరుదెంచి విప్రుగని। భూసురోత్తమా కదలుముయిపుడే పోదముకిష్కింధకు ననియనియెను॥ దా ॥ అష్టభార్యలెల్ల ।విప్రాంగనలై । యిష్టపడుచురాగా। శ్రేష్టంబని శ్రీరుక్మిణి లక్ష్మీబాయియగుచు దనవెంటనడువగా । కష్టమువోచక కదలిచనిరి శ్రీకమలనాభుసత్కృప యెటువంటిదో॥ దా॥ చీరలురవికెలును భూషణములు । చెలగిఫలంబులును । వారకభూసురయువతీజనముల। వారిగగొనియిరు వాగులనడువగ।భూరివిభవమునరుక్మిణియింటికి।సొసగజనిరిశుభవాద్యములతో ॥దా॥

వ॥ ఇవ్విధంబున కపటవేషంబులు ధరించి పాండురంగనాథుండు భార్యలంగూడి మంగళ వాద్యంబులతో పురందరుని కూతురు రుక్మిణింటికి జనునెడకిష్కింధాపురంబునగల స్త్రీలు కపటపురందరుని వెంటజనుయువతీ జనంబులశృంగారంబు వీక్షించి యొకరికొకరు తమలోనిట్లనిరి॥

బ్యాక్ రాగం - ఆదితాళం.

సావధానమేలనే । సారసాక్షులజూతామే । భావజజనకునిసతులనదగిశృంగారరూపములతోవిలసిల్లిరి ॥ సా ॥ భామవినవెవారెవ్వరె । భూమిలోనపొడగానమె । కోమలివారిముఖాబ్జవిలాసము లేమివిచిత్రముగనివత్తంబిక ॥సా॥

వ॥ ఇట్లు భక్తపరాధీనుండగు పాండురంగనాథుండు పురందరుని కూతురియింటికేగి యచ్చట సేయందగు వేడుకలెల్లంజే

యింది రుక్మిణికి నమూల్య వస్త్రాభరణంబులొసంగి పురజనం బులనెల్ల వస్త్రభూషణ భోజనంబుల దృప్తిపరచి చనియెనటుపి మ్మట కిష్కింధాపురంబుననుండి కొందరుజనులరుదెంచి యచ్చ టజరిగిన వృత్తాంతంబుజెప్పిన పురందరుండువిని యత్యాశ్చర్యం బునొంది హరింగూర్చి యిట్లనియె ॥

శహనరాగం - ఆటతాళం.

నీపాదసేవసద్భక్తిగల్గినవారికేమితక్కువజగతీ । నాపా లిదైవమనాపెన్నిధానమ నన్నుబ్రోచిన శ్రీనాధదయానిధే ॥ నీ॥ జననమరణబాధలనుజెందగజాలఘునతరకృపశీలా । వనజాక్షునీమ హిమవర్ణింపతరమౌన । దనుజమర్దనశ్రీనిగమాద్రివాస ॥నీ॥

వ॥ ఇవ్విధంబున భగవంతుం దలంచుకొనుచు కాలంబుగడు పుచుండెనంత నొక్కనాడు పురందరుండలి శీఘ్రంబుగ పెరటి కిబోవుచు శిష్యునింబిలచి యుదకంబుదెమ్మని జెప్పిపోయెనంతభ గవంతుండు శిష్యునివేషంబుధరించి యొకచిన్న గిండితోనుదకం బొసంగె నదిగాంచి పురందరుండిది యేమనికోపగించి యాగిం డినతని శిరంబుపై విసరివేసిన శిరంబున దెబ్బదగిలి యతండదృ శ్యుండయ్యె నంతలోనిజ శిష్యుండు గొప్పచెంబుతో జలంబొసం గెనంత భగవంతుం డితనికి యహంకార శేషంబున్నది గావున నితని శిక్షించెదనని తలంచి తానుపురందరు వేషంబుధరించి పాం డురంగనాధుని హస్తకంకణంబు దీసికొని యాపట్టణంబున నొక వేశ్య కాంతయింటికరిగిన నదిలేచి వందనంబు గావించె నంతకప ట పురందరుండు దానితోనిట్లనియె॥

హింమస్తానికాపి - చాపు.

సురకామినిబోలెదవీవు ।ననునీహృదయాబ్జములోవీడకుమి క ॥సు॥ విరిబోణిశిరోయీకరకంకణము । నరుదారగనీకొసగెదని పుడే । అరమరలుమదినుంచకే । భయమెంచకే । పరమపురుషు నిభక్తుడంచును పణతిరోమదినుంచవలదిక ॥ సు ॥ రమణీమణినీస రిసాటెవర్తే । కమలాసనుడేవిధిసృజియించె । కమలముఖినను మానకే । యెడసేయకే । సుమహితంబుగనిన్ను మెచ్చునుసుంద రీనిగమాద్రివాసుడు ॥సు॥

వ॥ ఇట్లు పురందరుండు బలికిన నావేశ్య యిట్లనియె ఓస్వా మీమేము జారిణులము మాకువావివర్తన నీతినిషిద్ధంబులు లేవు మాజీవనంబు మిగులగహితంబు మాకుద్రవ్యార్జనమే ప్రధానం బు ఎట్టిపురుషునైనను సమయోచిత ప్రసంగంబులవలన మావ లలం దగులంజేసి వానికిగల గృహధన పశుక్షేత్రాది సర్వస్వ మునాచికొని వాడునిర్ధనుండై కులభ్రష్టుండై యిహపరంబులకు రెంటికిం జెడిన పిదపనిర్దయులమై వానిని మాగృహంబుల చెం తరానివ్వము తమవంటిపెద్దలు మాదేహంబులంటిన వేయిమార్లు గంగాస్నానంబు జేసినను పవిత్రులగుట దుస్తరంబుగాన మాసాం గత్యంబు వలదనియెంతజెప్పిన వినకహస్తకంకణంబు దానికొసం గి యారాత్రి యొకించంతసేపు దానియొద్దనుండి యదృశ్యుండ య్యె. మరుదినంబున పాండురంగస్వామి హస్తంబున కంకణం బులేనందుకు పరిచారకులు ప్రభువునకు విన్నవించిన చారులువి చారించునెడ వేశ్యయరుదెంచి నిన్నటిరేయి పురందరదాసు నా

కీకంకణంబొసంగి నాతోడ నిద్రించిచనెనని కంకణంబు రాజు ముంగలనిడిన నతండత్యంత కోపసంతప్త హృదయుండై దాసుం బట్టితెమ్మనిన భటులరిగి పురందరుండు భీమానది యందుస్నానం బుజేసి గృహంబునకేగునెడ నతనింబట్టితెచ్చి రాజుసన్నిధి నిలువంబెట్టిన నారాజుచూచి భగవంతుని నగను వేశ్యకొసంగిన వానిని నేజూడజాల నితనింగొనిపోయి యొకవృక్షంబునకు గట్టికొట్టుడని యాజ్ఞాపించిన నొకచెట్టునకు గట్టివేత్రంబుతొ నొకటిరెండు దెబ్బలుగొట్టిన పురందరుండు హరింగూర్చి యిట్లనియె॥

మారువ - ఆది.

శ్రీపాండురంగరార । నవనీతచోర । శ్రీపాండురంగరారా । తాపసవరదసంతోషనిగ్రహభక్తతారక వేగరారా । నన్నేలుకోర ॥ శ్రీ ॥ దీనపోషణ వేణుగానవినోదముని మానసనిలయరారా । యిదిసమయిమర ॥ శ్రీ ॥ కరిరాజవరద వేదగిరినాధమురభంజన । సరసీజనయనరారా । సత్కృపాచతుర ॥శ్రీ॥

వ॥ ఇట్లు మొరబెట్టిన దయాసముద్రుండగు పాండు రంగనాథుండు పరిచారకుని యందావేశించి వేశ్యకుహస్త కంకణంబేనొసంగితి పురందరుండొసంగలెదు అతనివిడువుండనిన తత్క్షణంబ తనివదలివైచి తా మొనర్చిన నపచారంబునకు మిగులచింతించివందనంబులు గావించిరంత పురందరదాసు గృహంబునకేగి తాను గిండి విసరివేసినది భగవంతుని మీదనేగాని శిష్యునిమీద గాదనియు తనకుగల్గిన యహంకారంబునకు ప్రతిఫలంబు గనుపరచెననిమనంబున నిశ్చయించుకొని హరింగూర్చి యిట్లనియె॥

యమున - ఏకతాళం.

కోరికెదీరెనరాజగోపాలా । జారిణికృహమునకేగగగానే ॥కో॥ నీరుదెమ్మనినేశిష్యునితోనన । నీవెశిష్యుడవైయింతజేసితివి॥కో॥ మానహీనముగపలువురిలోనవ । మానమొసర్చినమహానీయమూర్తివి ॥కో॥ నీమాయదెలియగనేర్తురెజగతీ । నీరజభవరుద్రాదులైనను ॥కో॥ ఏమిరెుఱుంగనిమూఢునిపైనీ । కింతచలంబేలనిగమాద్రిశ్వర ॥కో॥

వ॥ కృష్ణా జ్ఞానానంద పరిపూర్ణ విగ్రహుండవై సర్వాంతర్యామివైయెందును గనుపడనట్టినిన్నాశ్రయించెడ కుతర్క ప్రసంగంబులచే నిరీశ్వరవాదంబులు సేయుచు నరకంబునబడెడు దరిద్రులచేత నీవుజూడంబడవు నీయందుభక్తిగలిగి నిన్నుధ్యానించుచుండెడు మహాత్ములహృదయ కమలంబుల బ్రకాశింపుచుందువు ప్రాణులకు ధనగృహ బాంధవనిమిత్తంబైన భయంబును తన్నాశ నిమిత్తంబైన శోకంబును మొదలగునవి యెంతకాలంబు గలిగియుండు నంతకాలంబువరకు ప్రాప్తంబుగాని. నిన్నాశ్రయించిన భయ రహితంబగు మోక్షంబు గలుగుగావున నీపాద సద్భక్తి యొసంగుమని మ్రొక్కి మరలనిట్లనియె॥

యదుకులకాంభోది - చాపు.

నినుచింతింపని జనులది బ్రతుకా । నిఖిలభువన నాయకా । వనజాక్ష నిగమాద్రివాసనీ పదసేవదొరుకున నావంటి దుష్టాత్ములకును ॥ ని ॥అతితామసమోహాది శోకములచే నతిబాధల నొందుచు ।గతినీవనియెంచక దుర్మదులై కాలముపోబుచ్చు

చు। సతతమచ్యుత నీమహాత్మ్యతచతుర మాయనుదాటగలరె మ
తిహీనులకు నినుగననెటు । నతహితా । గుణయుతా । బుధను
తా॥ నిను ॥

డోరా.

ధనకాంక్షనుబడి దినములుగడిపితి దైవరాయయేమందు।
ఘనకరుణను నీపదసద్భక్తి నిగలుగ జేయుమికముందు॥.

వ॥ ఇట్లనన్యభక్తి యోగంబున నిర్మలజ్ఞాన సంపన్నుండై హ
రిభక్తాగ్రగణ్యుండై యుపనిషదర్థ ప్రతిపాదకంబులగు నాలుగుల
క్షల యెనుబదివేల నామంబులచె భగవంతు ననంతకళ్యాణ గు
ణంబులు స్తుతించి కొంతకాలంబునకు శ్రీవైకుంఠంబునకు జని శ్రీ
మన్నారాయణ చరణకమల సాన్నిధ్యంబున నిత్యసుఖం బనుభ
వింపుచుండె॥

కం॥ దానవదైత్యభుజంగము । మానవగంధర్వసురసమాజము
లోల।క్ష్మీనాధచరణకమల। ధ్యానంబున నెవ్వడైనధన్యతజెందుఁ॥

డోరా.

ఇది శ్రీహరికథయెవ్వరు చదివినసదముల భక్తినివిన్నఁ।
సదయుడగుచు శ్రీహరియొసగును సిరిసంపదలెల్లనుచాలఁ॥

గద్య॥ ఇదిశ్రీ వేదాద్రిలక్ష్మీ నరసింహ చరణసేవక వరగంటి
కుల పవిత్ర శేషగిరి దాసపుత్ర శ్రీవత్సగోత్ర సుజనవిధేయ వెం
కటరమణనామధేయ ప్రణీతంబగు పురందర దాసచరిత్రంబు
సర్వంబు నేకాశ్వాసము,

సౌరాష్ట్రరాగం - ఆదితాళం.

నీపాదయుగళమునకు నిత్యజయమంగళం ॥రామ॥ బ్రహ్మాది సకలదేవభావితభావమైన॥ నీ ॥ సకలయోగీంద్రహృదయసంస్థిత మై వెలుంగు ॥ నీ ॥ అక్షీణముగను మోక్షలక్ష్మీనొసంగునట్టి ॥ నీ॥ భవబంధములను ద్రుంచి భవలయములను మాన్చు ॥ నీ ॥ వరవేదశై లమున నిరతము తేజరిల్లు॥ నీ ॥

ప్లవ సంవత్సర ఫాల్గుణ బ ౬ సోమవారం సంపూర్ణం.

కృష్ణార్పణమస్తు.

